# వెన్నెలవీణలు
(గేయ కావ్యం)



రచన :

డాక్టర్ వక్కలంక లక్ష్మీపతిరావు

భూపయ్య అగ్రహారం, అమలాపురం-533 201.

(ఆంధ్రప్రదేశ్)

ప్రథమ ముద్రణ : డిసెంబరు 1993

ప్రతులు : వేయి

ముఖచిత్ర రచన : బాపు

మూల్యము : ఇరవై రూపాయిలు

ప్రాప్తిస్థానము :

డాక్టర్ వక్కలంక లక్ష్మీపతిరావు
**"కవిత"**
భూపయ్య అగ్రహారం, అమలాపురం-533 201
ఫోను నెంబరు 22077

**ముద్రణ :**

**సత్యసోమా ప్రింటర్స్, సూర్యారావుపేట, కాకినాడ-1**

నేను అడిగినవెంటనే భావగర్భితంగా
ముచ్చటైన ముఖచిత్రాన్ని గీసియిచ్చిన
మహాభావుకచక్రవర్తి బాపూగారికీ,
అందమైనఆబొమ్మకు రంగు లద్ది ఆకర్ష
ణీయంగా అందించినసామర్లకోట రాంషా
శిరీషాప్రింటర్సుఅధినేత డా॥పూషాగారికీ,
నాపాటలను అక్షరాలలో పొదిగిన
కాకినాడ సత్యసోమా ప్రింటర్సు అధినేత
శ్రీ K. V. V. సుబ్బారావుగారికి
నాకృతజ్ఞతాంజలులు సమర్పిస్తున్నాను.

లక్ష్మీపతిరావు



మాటాడనికవ్వులకలాలకు
పాటలు నేర్పేమొనగాడా!
మాటలలో మధువులు కురిసి
మైమఱపించేచెలికాడా!

పరుసవేది నీగళమును తాకిన
ప్రతిభాషా బంగారం!
నీవు ధరించేప్రతిపాత్రా
కళాసరస్వతిమణిహారం!

నీనవ్వులలో వెన్నెల వుంది!
నిండుమనసులో వెన్నెల వుంది!
వెన్నెల లంటే నీ కిష్ట మని
వెన్నెలవీణలు నీ కిస్తున్నా!

ఈవెన్నెలవీణలలో
నవరాగం పలికించు!
స్వరరహస్యవేదీ! బాలూ!
చిరంజీవి వై దీపించు!

లక్ష్మీపతిరావు



కృతిభర్త

**శ్రీ యస్. పి. బాలసుబ్రహ్మణ్యం**

యస్. పి. బాలసుబ్రహ్మణ్యం
మద్రాసు - 34

వక్కలంకవారికీ నాకూ పరిచయం పాతికేళ్ళ నాటిది. వారి "ఆంధ్రపుణ్యక్షేత్రాలు" పాట జానకిగారితో కలసి కొలంబియావారికి 1968లో కీ॥శే॥ సాలూరి హనుమంత రావుగారిసంగీతదర్శకత్వంలో పాడడం జరిగింది. అది నామొదటి ప్రైవేటురికార్డు. ఈ పాతికేళ్లలో ఎక్కువసార్లు కలుసుకునేఅవకాశాలు వారక్కపోయినా, మామైత్రి ధృఢ మైంది. కృతిభర్తగా నాఅర్హతానర్హతలు పక్క నుంచితే, కేవలం వక్కలంకవారిమీదున్నగౌరవాభిమానాలే నన్ను ఈ సాహసాన్ని కాదనకుండా చేశాయి. మేష్టారినైజం లాగానే, వారికవిత్వం, వారిభావుకత లలిత మైనవి. ఎంత ఎక్కువమందిచదువరులమన్నన పొందితే, కృతిస్వీకర్తగా నాబాధ్యత అంతసఫలీకృత మైనట్టే. లక్ష్మీపతిరావుగారికి మరొక్కసారి సవినయంగా నమస్కరిస్తూ

మద్రాసు
1-12-93

బాలు, S. P.

ఇదీ వరస :-　　　　పుట

# అందాలసీమ

చిలకాకుపచ్చపైరు పైట వేసి
ఒయ్యారం ఒలికేఅందాలభామా !
పచ్చాపచ్చనిచేల ముచ్చటగా విహరించే
అందాచందాలభామ కోనసీమా !

కన్నెగోదారికీ యెల్లు వొచ్చి పొంగితే
వయసొచ్చినగోధారిని కడలి వాటేసుకుంటె
పుట్టిం దీముద్దుబిడ్డ కోనసీమా !
పెట్టి పుట్టిందీ సిరులకు అందాలసీమా !

నందనాన్ని తలదన్నేనారికేళవన మిది !
కోటికోటిరంభలతో కులికేటిస్వర్గ మిది !
స్వర్గాన్ని తల దన్నేఅందాలసీమ యిది !
వేదాలనాదాలు వినిపించేతల్లి యిది !

కోనసీమకోకిలమ్మ గొంతెత్తి పాడితే
పాట విని గోదారి పరవశించి పొంగితే
ఊరూరా పెళ్లినందడి !
పచ్చనితోరణాల పెళ్ళిపందిరి !!

చిలకాకుపచ్చపైరు పైట వేసి
ఒయ్యారం ఒలికేఅందాలభామా !
పచ్చాపచ్చనిచేల ముచ్చటగా విహరించే
అందాచందాలభామ కోనసీమా !



# సరిగమలు

గలగల పారేసెలయేరులలో
సరిగమ లున్నాయి చూడు !
జలజల దూకేజలపాతంలో
సంగీత ముంటుంది చూడు !

ఱాతిలోనిరసహృదయం
చాటుతుంది జలపాతం !
కడలిలోనివలపుపొంగు
తెలుపుతుంది ప్రతికెరటం !

మోడుబ్రతుకులో చిగురుకోరికలు
ఆమని చూపేను చూడు !
మూగమనసులో వలపువీణియలు
మ్రోయించి ఒకసారి చూడు !

పూల నడిగితే చెబుతాయి !
గాలికికూడా వల పుం దని !
గాలి నడిగితే చెబుతుంది !
వెదురుబొంగులో గాన ముం దని!

మనసునకే క ళ్ళుంటే
అణువణువున అందాలే !
స్పందించేమన సుంటే
ఈజగ మొకనందనమే !

గలగల పారేసెలయేరులలో
సరిగమ లున్నాయి చూడు !
జలజల దూకేజలపాతంలో
సంగీత ముంటుంది చూడు !



# మంగళతోరణాలు

విశాలాంధ్రమహితోత్సవ
విస్తృతసంరంభంలో
అశేషాంధ్రనరనారీ
జనరసమయహృదయంలో
ప్రభాతభేరీ మ్రోగింది !
సమైక్యగీతం సాగింది !
మాతృదాస్య మడచినఓ
అపరగరుత్మంతులార !
అమ్మ విశాలాంధ్రి కన్న
ఆణిముత్తియములారా !

రండు రండు కదలి రండు !
లలితోత్సవ మరయ రండు !
సురుచిరాంధ్రసితకీర్తికి
జోహారులు చేయ రండు !

అమరవీరు డైనపొట్టి
శ్రీరాములు కేరీ సరి ?
గుండుదెబ్బ కెదురేగిన
దండిమగడు టంగుటూరి !

ప్రపంచైకపండితు డా
సర్వేపల్లి !
మహామహులకన్నతల్లి
మనతెలుంగుతల్లి !
అన్నపూర్ణ యైనఅమ్మ
మనసు పాలవెల్లి !

తేనెవంటిభాష ఒక్క
తెనుగే ! తెనుగే ! !
ఇది తెలిసినతెలుగుబ్రతుకు
మలగనివెలుగే !

రాణ్మహేంద్రగోదావరి
రసతరంగములను తేలి
రాయలు మోసినబంగరు
పల్లకిపై నూరేగి
మాటలలో విరితేనెల
తేట లొలుకుతెనుగువాణి
జ్ఞానపీఠబహుమానము
లందినది మహాంధ్రవాణి !

అరవనోట తెనుగుపాట
పలికించెను త్యాగయ్య !
కన్నడశైవుల కాంధ్రము
నేర్పించెను సోమయ్య !

అమరావతినగరములో
శిల్పముగా పూచి
నారాయణదాసులోన
హరికథగా తోచి

ద్వారముకరపద్మములో
వాయులీనముగ సాగి
సంగమేశ్వరునిచెంగట
వీణియగా మ్రోగి
కూచిపూడినాట్యములో
తులుకులు పచరించి

ఎదయెదలో వేణువు లై
అణువణువున వీణియ లై
కళాభారతీనూపుర
ఘలంఘలలు మార్మోగెను !
అవని రసానందవివశ
యై ఆంధ్రిని కీర్తించెను !

విశాలాంధ్రరజతోత్సవ
వికసితసంరంభంలో
అశేషాంధ్రనరనారీ
జనరసమయహృదయంలో

కోటివీణియలు మ్రోగాయి !
శాంతిపావురము లెగిరాయి !!



# అందాలతార

ఎటనో తారాపథాన
అలమటించుచుంటివో తారా!
దూరదూరతీరాలను
ఏరికోసమే వెదకేవూ?

ఎవరికోసమే మెఱసేవూ!
ఎవరికోసమే మురిసేవూ!!
తళుకుతళుకుమని మెఱసేతారా!
ఎవరవే? నీ వెవరవే?

శివునిజటాజూటములో
పరిమళించునవమల్లికవో!
చందమామగిలిగింతలలో మై
పులకరించునందాలరాణివో!

ఇరులు నిండునీలాలనింగిలో
నిలిచి వెలుగునవదీపకళికవో!
అందము చిందేమందాకినిలో
దోగినజ్యోత్స్నాబాలికవో!

గగనసీమ యనుకడలియలలపై
తేలియాడుముత్యాలమొలకవో!
అమరనాట్యభంగిమముల త్రిదశుల
మనసు దోచునవనర్తకివో!
ఎవరవో! నీవెవరవో!



# రసికత

కళాదృష్టి లేనిజీవి లోకంలో లేదు!
సంగీతప్రీతి లేనిప్రాణి అసలు లేదు!

జలజల మనిపారేసెలయేరు పాడుతుంది!
రేబవళ్ల ఉప్పొంగుతు కడలి పాడుతుంది!

ఈల వేసి హుషారుగా గాలి పాడుతుంది!
తేనెమనసుపూలదరిని తేటి పాడుతుంది!

ఏటిపాట వింటు బండఱాయి కరగుతుంది!
తేటిపాట వింటు పూలమనసు కరగుతుంది!

ఆమనిలో గొంతు విప్పి పికము పాడుతుంది!
పికము పాడుతుంది-బుల్బులుపిట్ట పాడుతుంది!

కన్నులనే చెవులు చేసి కాలనాగు వింటుంది!
పాట వింటు పడగవిప్పి పరవశించిపోతుంది!

శిశువు పశువు పాము గానరసవివశములే!
జగతిని అణువణువు గానరసవివశమ్మే!

సంగీతప్రీతి లేనిప్రాణి అసలు లేదు!
కళాదృష్టి లేనిజీవి లోకంలో లేదు!



# వెన్నెల

పకపక మని ఆకాశం
పగులబడి నవ్విందా ?
వెండికొండ కరగి కరగి
యేఱై ప్రవహించిందా ?

సురతరుణులచిరునవ్వులు
ధరణికి దిగజాఱినవా ?
కట్టలు తెగి అమరగంగ
పుడమిని ముంచెత్తిందా ?

అమరులు సురపారిజాత
సుమవర్షం కురిశారా ?
శివునిజటాజూటములో
సిరిమల్లెలు విరిసినవా ?

పున్నమపువు చందమామ
వెన్నెల విరజిమ్మిందా ?
ఆవెన్నెల అసమశరుని
కారతి పట్టిందా ?

పకపక మని ఆకాశం
పగులబడి నవ్విందా ?
వెండికొండ కరగి కరగి
యేఱై ప్రవహించిందా ?



# ఇది మాదేశం

ఇది మాదేశం !
స్వతంత్రభారతదేశం !
ఈదేశం ! మాదేశం !
భారతదేశం ! మాదేశం !

పరులముందు తలవంచనిరాణా
ప్రతాపు పుట్టిన దీదేశం !
రుద్రమదేవుల ఝాన్సీలక్ష్మల
రూపొందించిన దీదేశం !

రసహృదయులు సమ్రాట్టులు కవులకు
పల్లకి పట్టిన దీదేశం !
జాల్ కరగించెడిఅమరగానమున
పరవశించినది మాదేశం !

ఈదేశం ! మాదేశం !
భారతదేశం మాదేశం !

మొగలుగుండెలో పొంగినప్రేమకు
ప్రాణము పోసిన దీదేశం !
బండఱాళ్లకును భావావేశము
నలవరించినది మా దేశం !

అణువణువున ఆత్మాభిమానమే
ప్రస్ఫుట మౌ నిది నాదేశం !
పరమసాధ్వులను కని పులకించిన
పవిత్రదేశం మాదేశం !

ఈదేశం ! మాదేశం !
భారతదేశం మాదేశం !

బుద్ధుడు శంకరభగవత్పాదులు
పుట్టి పెరిగినది మాదేశం !
ఆపరమాత్ముడు రామకృష్ణులుగ
అవతరించినది మాదేశం !

కర్మవీరులను ధర్మవీరులను
కని పెంచిన దిది మాదేశం !
శాంతిదూతలను జగతి కొసంగిన
స్వతంత్రదేశం మాదేశం !

ఈదేశం ! మాదేశం !
భారతదేశం మాదేశం !



# ఆమని

ఏటేటా వచ్చి పోవు ఆమనీ !
జగతికి నీ సందేశం ఏమనీ ?

మల్లెల విరునవ్వులతో
మనసు కలిపి వచ్చావా ?
చిరుమామిడితోరణాలు
ఇంటింటికి తెచ్చావా ?

కోకిలపేరంటాలికి
రమ్మని కబురంపావా ?
చిలుకలముత్తైదువులకు
వాయినాలు ఇచ్చావా ?

మాకందముకౌగిలిలో
మాధవీలతను చూపి
నవవధువులమనసులలో
మధురోహలు రేపావా ?

చివురాకులనవకంలో
తళతళలను పలుకరించి
చేదుమనసువేపపూల
చెఱకుతీపి కలబోసి

ఏటేటా వచ్చిపోవుఆమనీ !
జగతికి నీసందేశం ఏమనీ ?

శిశిరపుదెబ్బకు వాడిన
మోడుమ్రాకులను చేరి
చివురాకులు పూలు తొడిగి
సేదదేర్చవచ్చావా ?

ఏటేటా వచ్చిపోవుఆమనీ !
జగతికి నీసందేశం ఏమనీ ?



# పువ్వుపువ్వునా సంగీతం

తరువుతరువునా సంగీతం !
పువ్వుపువ్వునా సంగీతం !
పువ్వుపువ్వుతో జతకలిపే
తేటిపాటలో సంగీతం !

వేదంలో సంగీతం !
నాదంలో సంగీతం !
వేదనలో సంగీతం !
సాధనలో సంగీతం !

మబ్బు ఉరిమితే పాట !
మనసు పొంగితే పాట !
కెరట మెగిరితే పాట !
గాలి కదిలితే పాట !

వేణు వూదితే పాట !
వీణ మీటితే పాట !
ఏరు పొంగితే పాట !
పికము పలికితే పాట !

తరువుతరువునా సంగీతం !
పువ్వుపువ్వునా సంగీతం !!



# గాలి

మనసు నిలకడ లేనిమన సైనగాలీ !
మనసార నిను కోరుమా కేది దారీ ?

కడలిలో అలలపై ఈదుతూ వచ్చేవు !
కోతివలె చెట్లెక్కి కొమ్మలను ఊపేవు !

ఏటిపై నావలకు బాసటగ నిలిచేవు !
వరిచేలపైన ఊయల లూగి మురిసేవు !

గాలిపటములతోడ కలసి ఆడుకొనేవు !
ప్రాణమ్ములో ప్రాణ మై మమ్ము తనిపేవు !

పూలగుండెలలోనిపరిమళాలను దోచి
పదిమందికీ పంచి ఊరూర తిరిగేవు !

వెదురుపొదలను జేరి వేణువుల నూదేవు !
నీకళోపాసనకు జోహారు లందేవు !

కంట పడకుండగా కౌగిలించుకొనేవు !
అంతలో కను మొఱగి అటు నిటూ పోయేవు !

మనసునిలకడ లేనిమన సైనగాలీ !
మనసార నిన్ను కోరుమా కేది దారీ ?



# తెనుంగుపాట

తెలుగుపాట పాడుదునా ?
ఎదయెదలో
వెలుగుపాట పాడుదునా ?
ఎడదలయెలమావిపైన
నిలిచి నేను కోకిలనై
తెలుగుపాట పాడుదునా ?

తేనెలలో తీయదనం
వెన్నెలలో చల్లదనం
కలబోసుకు జాలువారు
తెనుగుపాట పాడుదునా ?

మల్లెలలో పరిమళాలు
గుబాళించి గుబాళించి
అమృత మొలుకుతెనుగుపాట
హాయిగా పాడుదునా ?

పాట వింటు మనసు మనసు
పరవశించిపోవునట్లు
ఏయెఱుగనిసీమలకో
యెడద తేలిపోవునట్లు
పాడనా ?
తెనుగుపాట పాడనా ?
ఎదయెదలో మారుమ్రోయ
తెనుగుపాట పాడుదునా ?



# వసంతకోకిల

ఈవసంతాలలో - ఈవనాంతాలలో
ఏరాగమో కదలి - నీరూపమే మెదలె!
ఏజన్మసౌహృదమొ - ఎదలోన ఉప్పొంగె!
ఓవసంతప్రియా!
ఓవనాంతప్రియా!

నవవసంతాలలో - నవకముఃలుఃచవి చూపి
ఊాలగుండెలలోన రసధునులు నించేవు!
ఎలదేటిగుండెలో - కలగానములు నించి
నవమల్లికలలోన వలపు లెగజిమ్మేవు!
ఓవనాంతప్రియా!
ఓవసంతప్రియా!

అవ్యక్తమధురమౌఆగానమధువులకు
మోడులును పులకించి - క్రొత్తచివురులుఃతొడుగ
గుండెగుండెలలోన - కుహుకుఃహూరాగమే!
పాట వినుప్రతిరసికుబ్రతు కొకవవసంతమే!
ఓవసంతప్రియా!
ఓవనాంతప్రియా!

గొంతులో వాసంత - శోభలను దాచుకొని
ఇంతలో ఎచటికో - ఎగిరిపోవగ నేల?
జగమెల్ల నిత్యావసంత మై విరియగా
ఉండిపోవే - ఎదల నిండిపోవే ప్రియా!
విశ్వమోహనసుధా
మధురగానప్రియా!
ఓవనాంతప్రియా!
ఓవసంతప్రియా!

❋

# కమ్మ వ్రాయ వేమెచెలి!

కమ్మ వ్రాయ వేమె చెలి!
కందోయికి విందుగా!
కమ్మవిల్తువింటినారి
ఝుమురఝు మ్మని మ్రోయగా! ॥కమ్మవ్రా॥

నీయూపిరిగాలి సోకి!
పరిమళించిపోయేదీ!
అచ్చ మైననీప్రేమకు
దర్పణ మై నిలిచేది! ॥కమ్మవ్రా॥

అతిశయోక్తు లెఱుగనినీ
యంతరంగ మెఱిగినది!
విరహ మెంతతీయనిదో
వివరముగా చెప్పేది! ॥కమ్మవ్రా॥

నీచివురాకులచేతిని
తాకి పులకరించేది;
అద్దమంటినీమనసును
నిద్దముగా చూపేది! ॥కమ్మవ్రా॥

సాత్త్వికభావోదయాన
చిత్తడితో తడిసినది!
చెమ్మగిలిననీకన్నుల
సిరులు మోసి తెచ్చేదీ! ॥కమ్మవ్రా॥

కమ్మ వ్రాయవే నా చెలి !
కరదోయికి విందుగా !
కమ్మవిల్తువింటినారి
ఝుమఝు మ్మని మ్రోయగా !
కమ్మ వ్రాయవే నా చెలీ !



# ఎవరిబాధ యెవరికి తెలుసు ?

ఎవరిబాధ యెవరికి తెలుసూ ఈలోకంలో ?
మనిషి మనిషిగా మారేది పెనుశోకంలో !

ఏరు నిలువు నీరయితే యెదపొంగనుకుంటాము !
కోకిల యేడుస్తుంటే గాన మని వింటాము !

తీగను కదలిస్తేనే వీణగోడు వినిపించేది !
స్వార్థము వదిలేస్తేనే పరులబాధ కనిపించేది !

ఏడుపులో ఉన్నతీపి యెద వాడనివ్వు !
పరులకోస మేడుస్తూ బ్రతు కంతా నవ్వు !

ఎవరిబాధ యెవరికి తెలుసూ ఈలోకంలో ?
మనిషి మనిషిగా మారేది పెనుశోకంలో !



# వేదన

వెదురు వేణు వై పలికేనా ?
ఎదకు గాయ మవకుంటే -
తీవ పూ వై కులికేనా ?
ప్రసవవేదన లేకుంటే -

ఏరు నడచి పోయేనా ?
ఎదకు పొంగు రాకుంటే -
ఆకడలిపిలుపు వినకుంటే -

సుప్తజగతి మేలుకొనేనా ?
రవికిరణం పిలువకపోతే -
ప్రాణికోటి జీవించేనా ?
ప్రేమమధువు కరవైపోతే -

మూగవీణ రవళించేనా ?
ఎదతంత్రులు కదలక పోతే -
బ్రతుకుతీపి తెలిసొచ్చేనా ?
మృతి అన్నదియే లేకుంటే -

వెదురు వేణువై పలికేనా ?
ఎదకు గాయ మవకుంటే -



# వెన్నెలకన్నెలు

చల్లనివెన్నెలకన్నెల్లారా !
కన్నెలకన్నులతళుకుల్లారా !
మల్లెలనవ్వులవలపుల్లారా !
మమతలు నిండినతలపుల్లారా !

మావిపూలతో జత కడతారా ?
మగువలమనసులు పలికిస్తారా ?
జాలిగుండెలో నినదిస్తారా ?
పూలగుండెలో పులకిస్తారా ?

వెన్నెలవెలుగులవెండినీటిలో
జలకా లాడును ఈజగ మంతా !
వెన్నెలవీణలమోహనరాగం
విని పరవశ మౌ నవయుగజనత !

చల్లనివెన్నెలకన్నెల్లారా !
కన్నెలకన్నులతళుకుల్లారా !
మల్లెలనవ్వులవలపుల్లారా !
మమతలు నిండిన తలపుల్లారా !

వినగలమనసుకు మౌనగీతికలు
వినిచేవెన్నెలకన్నెల్లారా !
మధురోహలతో మనసులు దోచే
కన్నెలకన్నులతళుకుల్లారా !

చల్లనివెన్నెలకన్నెల్లారా !
కన్నెలకన్నులతళుకుల్లారా !
మల్లెలనవ్వులవలపుల్లారా !
మమతలు నిండినతలపుల్లారా !



# మధుగీతం

మధుమాసం వచ్చిం దని
మనసు మనసు విరిసింది !
వయ సొచ్చినప్రతితీవా
వలపుపాట పాడింది !

కుహూ కుహూ కుహు మంటూ
గున్నమావి పాడింది !
ఆవసంతగానానికి
మోడు చివురు తొడిగింది !

తుమ్మెదసన్నాయితో
సందడించి యిల్లిల్లూ
మంగళతోరణము కట్టి
మధుగీతం పాడింది !

మాధవిలత చెట్టపట్టి
మావి పులకరించింది !
శుభమ స్తని ప్రకృతితో
శుకము గొంతు కలిపింది !

మధుమాసం వచ్చిం దని
మనసు మనసు విరిసింది !
వయ సొచ్చినప్రతితీవా
వలపుపాట పాడింది !



# వెన్నెలవీణలు

వీణలు వీణలు వీణలు !
పలుకులనెఱజాణలు !!
కళాతపస్వులు కవులగుండెలో
మీటక మ్రోసేవీణలు !!

పలుకులలనకెంగేలివీణియకు
తోబుట్టువు లీవీణలు !
ప్రణయగానమును ప్రణవనాదమును
పలికించే వీవీణలు !

కళోపాసకులకమ్మనిబ్రతుకుల
వెన్నెల కాసేవీణలు !
రసలోకాలను భువికి దింపగా
రవళించే వీవెన్నెలవీణలు !

వీణలు వీణలు వీణలు !
మీటక మ్రోసేవీణలు !!
వీణలు వీణలు వీణలు !!
కులుకులనెఱజాణలు !!



# గోదారికులవేటి?

గోదారి కుల వేఁటి ?
బూదేవి కుల వేఁటి ?
నువ్వు నేను కలడానికి
మద్దెని కుల వఁ డ్డేటీ ?

నావలో నీ ళ్లుంటే
నావ మునిగిపోతాది !
మనిషిలో కులం వుంటే
మనసు కుళ్ళిపోతాది !

ఆబోతులు కలబడితే
లేగదూడే సచ్చేది !
కులం కులం కలబడితే
కుఱ్ఱోళ్లేనలిగేదీ !

పువ్వులాటిమన సుండగ
బురదలాటికుల వెఁందుకు ?
మనసు మనసు కలిసిపోతె
మద్దోళ్లకి బా దెందుకు ?

గోదారి కుల వేఁటి ?
బూదేవి కుల వేఁటి ?
నువ్వు నేను కలడానికి
మద్దెని కుల వఁ డ్డేటీ ?



వర్ణాంతరవివాహం చేసుకోవా లనుకొన్నప్రేమికురాలిఆవేదన.

# కన్నీళ్లు !

ఎన్నికళ్లు యేడిస్తే
ఇన్నినీళ్ళు పొంగాయో !
ఎన్నికోట్లకళ్ళు తడిసి
ఇన్నికడలు లయ్యాయో !

కడలినిండా కన్నీళ్ళు !
పుడమి విడిచినకన్నీళ్ళు !
పుడమిగుండెల కన్నీళ్ళు !
పుడమిచుట్టూ కన్నీళ్ళు !

ఆకాశం యేడుస్తుం
దప్పు డప్పుడు !
అవనిబాధ చూడలేక
గుండె రగిలినప్పుడు !

దుష్టదురాచారదళిత
దుఃఖార్తులకళ్ళల్లో
యుగయుగాలనుండి పొంగు
తున్నవి యీకన్నీళ్లు !

ఏడుస్తూ చచ్చినోళ్ల
చేదుగుర్తు కన్నీళ్ళు !
యుగయుగాలకన్నీళ్లు !
దగాపడినకన్నీళ్లు !

లోకానికి శోకానికి
వీడనిబంధం !
అదే ! అదే ! అనాదిగా
ప్రాణికోటిప్రారబ్ధం !

ఎన్నికళ్ళు యేడిస్తే
యిన్నికడలు లయ్యాయో !
ఎన్నికోట్లకళ్ళు తడిసి
ఇన్నికడలు లయ్యాయో !



# కరుణామయా !

ఏనామము నీది కాదు ?
ఏరూపము నీది కాదు ?
నామరూపరహితాత్మా !
నాలో వెలిగేపరమాత్మా !

గాలితెర వై వచ్చి నన్నూ
కౌగిలించేకన్నతండ్రీ !
చల్లగా నాలోని కేగీ
నాకు ఊపిరి పోయుస్వామీ !

శూన్య మై నే నుండడానికి
చోటు చూపేవు !
ధాత్రి వై ప్రియధాత్రి వై నా
క్షుధను తీర్చేవు !

తరువు వై ఆదరువు వై నా
కరవు తీర్చేవూ !
పువ్వు వై నను పలుకరిస్తూ
వలపు పంచేవూ !

మనసు కరగేమబ్బు వై రస
జలధి తేల్చేవు !
మెఱపు వై చీకట్లబ్రతుకున
దారి చూపేవు !

ఎందుకో నాయందు నీకూ
ఈయకారణమైన ప్రేమా !
తల్లి వైనా తండ్రి వైనా
మాకు నీవే ప్రేమధామా !

జాలివి నీవు !
సమ్మోహనలీలవు నీవు !
పాంచభౌతిక ప్రపంచమూలము నీవు !
మూలము నీవు !
జగదింద్రజాలము నీవు !

మనసులలో తొలకరించు
మెఱపువు నీవు !
మధురానుభూతివి నీవు !!
మనసున కందనిభావము నీవు !!

అందనిశిఖరాలలో
ఆనందపుటంచులలో
అందఱిలో విహరించే
ఆనందాకృతివే నీవు !

నామరూపరహితాత్మా !
నాలో వెలిగేపరమాత్మా !



# రసధారలు

ఇవి సన్నని దారాలా ?
కవితవోలె మృదువైనవి !
కనిపించనినేతగాళ్ల
పనితనమును చాటేను !

ఇవి వెన్నెలతీవియలా ?
ఎండకు మెఱసేను !
తపించిపోయేజగతికి
చలువలు పంచేను !

ఆకాశంవెండిముద్ద
ఎండకు కరగిందా ?
కరగి కరగి నీరై భువి
ధారగ కురిసేను !

రసహృదయాకాశం దిగి
పుడమిని వాటేసిందా ?
తాప మెడలి పుడమితల్లి
వలపులు విరజిమ్మేను !

ఇవి సన్నని దారాలా ?
కవితవోలె మృదు వైనవి !
మిన్ను మన్ను కలపా లని
రేబవళ్ళు చూస్తున్నవి !

ఇవి సన్నని దారాలా ?
కవితవోలె మృదువైనవి!



# 'కో' అంది ఒకకోకిల !

"కో" అంది ఒకకోకిల !
"కుహూ కుహూ" మంది ఒకకోయిల !
ఆపలుకుల కర్థ మేమిటో
తెర తీసినవయసుకె తెలుసు !
విచ్చురించినవెట్లకె తెలుసు !

కోకిలపిలుపే లేకుంటే
వసంతాలు విరిసేనా ?
వలపులు కురిసేనా ?
మనసులు మురిసేనా ?

ఎన్నివసంతాలైనా
దేని కదే కొత్త !
ఎన్నిపూలు పూస్తున్నా
దేనివలపు దానికె కొత్త !

కొత్తదనం లేకుంటే
వయసులో పస యే ముందీ ?
కొ త్తనేది లేకుంటే
బ్రతుకులో తీ పే ముందీ ?

"కో" అంది ఒకకోకిల !
"కుహూకుహూ" మంది ఒకకోయిల !!



# మనసు

మనిషిమనిషికీ ఒకమనస్సు !
అది యెంతచిత్రమైనదో యెవరికి తెలుసు ?

ఎంతచిన్నదో అంత పెద్దది !
ఎంతముసలిదో అంతపడుచుది !

కడలి వుంది కొండా వుంది ! గాలికన్నవేగం వుంది !
ఇంతచిన్నిమనసులో ఈజగమే దాగుంది !

మనసు మూగదే అయినా మాటలాడుతుంది !
వయసు మీద పడుతున్నా మమత పెంచుకొంటుంది !

ఒంటరిగా ఉన్నమనసు జంట కోరుతుంది !
తుంటరిగా మారుమనసు జంట నేడిపిస్తుంది !

రూపు లేనిమనసులో కోపం ఉంది !
ఆకోపంలో ఆరిపోనితాపం ఉంది !

కోరికలను పెంచి పెంచి కొంప ముంచుతుంది !
మనిషి చచ్చినా కానీ - మనసు చావ నంటుంది !

ఏడిపించి నవ్వుకొనేమన సుంటుంది !
నవ్విస్తూ కవ్విస్తూ నవ్వేమన సుంటుంది !
ఏడిపించి తానుకూడ ఏడ్చేమన సుంటుంది !

మనిషిమనిషికీ ఒకమనసు !
అది యెంతచిత్ర మైనదో యెవరికి తెలుసు ?



# మన మందఱమూ ఒకటే !

అందఱమూ ఒకటే !
మన మందఱమూ ఒకటే !

తార లెన్ని వెలిగినా
ఆకాశం ఒకటే !
తరగ లెన్ని పొంగినా
ఉన్నకడలి ఒక్కటే !

కిరణాలు వేయి ఉన్నా
వెలిగేసూర్యు డొకడే !
చరణాలు ఎన్ని ఉన్నా
పాడేపాట ఒకటే !

భాష లెన్ని పలికినా
భారతాత్మ ఒకటే !
ఎన్ని పేర్లతో పిలిచిన
ఉన్న దేవు డొక్కడే !

తనయుల మెందఱ మున్నా
తల్లి ఒక్కతే !
కన్నతల్లి ఒక్కతే !
హిందూ ముస్లిం లెందఱ మున్నా
భారతీయులం అందఱ మొకటే !
భారతాత్మ అంతా ఒకటే !



# చందమామ రా దేమీ ?

చందమామ రా దేమీ ?
జాబిల్లి రా దేమీ ?
కొండకొమ్మమీదనుండి
క్రిందికి దిగి రా దేమీ ?

"దాయిదాయిరావే" అని
యెన్నిసార్లు పిలిచినా
చందమామ రా దేమీ ?
జాబిలి రా దేమీ ?

పాలకడలిముద్దుబిడ్డ
పాలల్లె ఉన్నాడు !
పాలమనసులో నల్లని
హాలహాలము ఉన్నవాడు !

అమృతకరుడు జాబిలి అని
అందఱూ అంటారు !
అతనిగుండె మండించే
హాలహాలము చూడరు !

అమృత మున్నచోటనే
హాలహాలము తప్పదా ?
పాలకడలిపోలికయే
జాబిలికీ వచ్చెనా ?

చందమామ రా దేమీ?
జాబిల్లి రా దేమీ?
ఆకాశంఅంచునుండి
అవనికి దిగి రా దేమీ?



# ఏ మవీ? అవి యే మవీ?

ఏ మవీ? అవి యే మవీ?
ప్రాంగణాన రంగారిన
పాలపుంతలే మవీ?
ఏ మవీ? అవి యే మవీ?

విశ్వశాంతి రేకలా?
తెలివెన్నెలవాకలా?
ఏ మవీ? అవి యే మవీ?

పాలకడలినురుగులా?
పసిపాపలనవ్వులా?
చలువవెన్నెలలు కాసే
తెలివెన్నెలపువ్వులా?

దివినుండీ భువిమీదికి
దిగి వచ్చినవెన్నెలలా?
పలుకులలనపెదవులపై
జారినచిరునవ్వులా?

ఏ మవీ? అవి యే మవీ?
ప్రాంగణాన రంగారిన
పాలపుంత లే మవీ?

నింగినుండి రాలి పడి
నిలుచుమెఱపుతీగలా?
సన్నజాజిపువ్వులా?
చిన్నదానినవ్వులా?

ఏ మవీ? అవి యే మవీ?
ప్రాంగణాన రంగారిన
పాలపుంత లే మవీ?

అవి యేమీ? ప్రతిముంగిట
అల్లిబిల్లిగా ఉన్నవి?
రంగారెడురంగవల్లు
లా? అన్నటు లున్నవి!

పసుపుకుంకుమలు దాల్చిన
ప్రాంగణశుభలక్ష్మలా?
వినువీథులనుండి భువికి
దిగినపాలపుంతలా?

చిత్రకళావిశారదల
చివురుచేతికదలికలా?
మదవతిపెదవుల రాలిన
మందహాసచంద్రికలా?

సంక్రాంతికి మింటినుండి
జాలువారువెన్నెలలా?
బుగ్గల సిగ్గులు పూచిన
పువుబోం డ్లిడుముగ్గులా?

ఏ మవీ? అవి యే మవీ?
ప్రాంగణాన రంగారిన
పాలపుంత లే మవీ?



# బాలలం!

భారతీయబాలలం!
భావితరంనేతలం!
లేతలేతమొగ్గలం!
తీపితీపిఆశలం!

నింగినుండి దిగి వచ్చినవెన్నెలలం!
రాగమధువులను చిలికేకిన్నెరలం!
భరతమాతముంగిటిలో వెలిగేమణిదీపాలం!
పిల్లలం! విరిజల్లులం!

సత్యాహింసాఋషి బాపూజీ
శాంతిదూత మాచాచా నెహురూ
పయనించినమార్గంలో
వెలిగేదీపికలం!

నిన్నటిరవరవలు మఱచి
నేటిస్నేహమే వలచి
అందఱితో జత కలిపే
ప్రపంచైకబాలలం!

శాంతిపావురాల మయి
జగ మంతా విహరిస్తాం
వసుధైకకుటుంబానికి
వారధులే నిర్మిస్తాం!

భారతీయబాలలం!
భావితరనేతలం!
అందరికీ వెలుగు పంచు
ఆశాదీపికలం!



# మంచికవిత

మల్లెలు పూయాలి !
మనసులో వెన్నెల
కాయాలి !

మంచికవిత వింటుంటే
మనసు పరిమళించాలి !
అణువణువూ రసమయ మై
ఆర్ద్రత విరబూయాలి !

కవిత నిండుమనస్సులో
దివిజగంగ దిగిరావాలి !
గుండె గుండె ఆ దేవుని
కోవెలయే కావాలి !

మంచికవిత చీకటిలో
దీపావళి కావాలి !
విన్నబోవుమనస్సులో
వేణువు లూదాలి !

మల్లెలు పూయాలి !
మనసులో
వెన్నెల కాయాలి !
అణు వణువూ రసమయ మై
ఆర్ద్రత విరబూయాలి !
మంచికవిత వింటుంటే
మనసు పరిమళించాలి !



# శాంతిసేన

శాంతిదేవిహృదయమ్మున
స్రవియించెను రక్తధార !
కదలిరండు కదనానికి
కదలిరండు వీరులార !

కమలమ్ముల తేంట్లు సమర
కాహళలను మొరయించెను
రక్తాంబరధారిణి యై
ప్రాగంగన వెలు వొందెను !

చెంగల్వలనయనమ్ములు
జేవురించి కనిపించెను!
మోదుగుపూవులమొగాలు
క్రోధోద్రిక్తము లయ్యెను !

లోకబాంధవునివదనము
రోషకషాయిత మయ్యెను !
సూర్యకాంతశిలలుకూడ
చురచుర మని మండిపడెను !

గాంధేయులకన్నులలో
కణకణ నిప్పులు కురిసెను !
కాశ్మీరారుణశోభలు
కదనశ్రీ వెలిగ్రక్కెను !

సుందరకాశ్మీరమ్మున
చొచ్చునుగ్రవాదులపై
గుండ్లవాన కురియింపుడు !
గుండెలలో నిద్రింపుడు !

రండు రండు కదనానికి
రండు దేశభక్తులార !
ఓభారతపుత్త్రులార !
ఓహో ! మహాయోధులారా !



# పాడకే కోకిలా !

ఈ వినియోగవీణ పైన
ఎన్ని గీతములు పాడిన
ఎట నున్నదొ కోకిలమ్మ !
చిన్నబోయె మావిరెమ్మ !

ఓ వసంత ప్రియా !
ఓ వనాంత ప్రియా !
విరహబాధాభయా !
ఓ వసంత ప్రియా !

నీనిట్టూర్పులగాడ్పులు
క్రొత్తమావి నెత్తావులు !
నిద్దురలేమిని తెలుపును
నీయెరయెఱ్ఱనిచూపులు !

గుండెగుండె విరహముతో
మండిపోవు నీపాటకు !
మండుచుండె చివురాకులు
పాటలోనివిరహాగ్నికి !

గొంతెత్తి జంటకై
కో యనుచు పిలువకే !
గుండెలో విరహాగ్ని
గుండాలు రేపకే !

ఓ వసంతప్రియా !
ఓ వనాంతప్రియా !
విరహబాధాభయా !
ఓవసంతప్రియా !



# మౌనం

చల్లనివెన్నెల కురిసే
జాబిలి మాటాడదు !
నవ్వుతునే కాలిపోవు
దివ్వెలు మాటాడవు !

ఎండ కెండి నీడ నిచ్చు
తరువులు మాటాడవు !
పరులకోసమే బ్రతికే
పువ్వులు మాటాడవు !

కనవు మేసి పా లిచ్చే
గంగిగోవు మాటాడదు !
కమ్మనిమధువులు చిలికే
కన్నులు మాటాడవు !

అహోరాత్రు లలచేసంద్రం
అడుగు ముందు కేయదు !
ఎగిరిపడేకెరటాలకు
నిరాడంబరత రాదు !

మౌనంలో ఉన్నగుణం
మాటలలో లేదు !
వినయంలో గుణం ఎగిరి
పడడం లేదు !

చల్లనివెన్నెల కురిసే
జాబిలి మాటాడడు !
నవ్వుతునే కాలిపోవు
దివ్వెలు మాటాడవు !



## ఆంధ్రపుణ్యక్షేత్రాలు

ఇదే ఆంధ్రభూమి ! ఇదే పుణ్యభూమి !
ఇది యోగులకు భోగులకు జన్మభూమి !
గౌతమీకృష్ణాతరంగాల పులకించు
మాతెలుగుసీమలో వెలయువేలుపులారా !
మాయిలవేల్పులారా !

తిరుమలశిఖరాల వెలసినదేవా !
మొఱ లాలించి లాలించి పాలించరావా ?
దివినుండి భువికి దిగి వచ్చినావు !
స్వర్గముగ తిరుపతిని వెలయించినావు !
కొండెక్కి కూర్చున్న శ్రీవెంకటేశా !
అడుగుననె పడియున్న బడుగులను కనవా ?
ఒక్కొక్కమెట్టె పై కెక్కించ రావా ?
శ్రీవేంకటేశా ! శ్రీతిరుమలేశా !

శ్రీకాళహస్తీశ్వరా !
భూలోకకైలాసవాసా ! మహేశా !
శ్రీకాళహస్తీశ్వరా !
సాలెపురుగునూ పాము నేనుగును
కన్నప్పను ఏలినదేవా !
నీపరీక్షలకు నిలబడలేము !
నీచరణములే శరణన్నాము !
శ్రీకాళహస్తీశ్వరా !

శ్రీశైలమల్లేశ్వరా !
భ్రమరాంబికాసతీహృదయేశ్వరా !
పార్థునికి పాశుపత మందించినావే -
మాకు నీచేయూత నందించ వేమీ ?
మనసులో మల్లియలు విరబూయుస్వామీ ;
మా బ్రతుకు పువుబాటగా మలచ వేమీ ?
శ్రీశైలమల్లేశ్వరా !

బెజవాడకనకదుర్గమ్మా !
విశ్వమోహనముగా వెలసినా వమ్మా !
తెలుగుహృదయాలు నీపూజాసుమాలు !
చల్లగా మము చూడు మమ్మ! అదె చాలు!
చల్లగా మము చూడు మమ్మా !
బెజవాడకనకదుర్గమ్మా !

అంగీకృతాభంగగంగాతరంగా !
ఓకోమలాంగా ! శ్రీభీమలింగా !
నీ వెట నుండిన అదె కైలాసం !
దక్షిణకాశీ దక్షారామం !
తెలుంగుసీమకు వెలుం గొసంగిన
దక్షారామమె భూకైలాసం !
ఈదక్షారామమె భూకైలాసం !

చిరునవ్వువెన్నెలలచెలువములు పండించి
ర్యాలిలో బాలలో పూలు పూచినస్వామీ !
కోనసీమావాస ! శ్రీజగన్మోహనా !
జోహారు! జోహారు! జోహారు! స్వామీ!
శ్రీజగన్మోహనా! జోహారు! స్వామీ!

త్యాగమయా! అనురాగమయా!
భద్రాద్రినిలయా! రామయ్యా!
అయోధ్య విడిచి అమ్మ సీతతో
ఆంధ్రావనికీ అరుదెంచితివా!

నరుడుగ పుడితే దేవుడె అయినా
నానాబాధలు పడవలెనా ?
రామదాసు నలనాడు కష్టముల
నాదుకొన్న ఓరామయ్యా !
చీకటిలో తారాడుమా కిపుడు
వెలుగుదారులను చూపవయా !
త్యాగమయా ! అనురాగమయా !

శ్రీసత్యనారాయణా ! హేశ్రీఆదినారాయణా !
శ్రీభూదేవులసేవ లందుచూ
అన్నవరములో వెలసినదేవా !
ఆపదమ్రొక్కులవాడ వయా
మా ప్రాపై నిలచినబంగరుకొండా !
కనుగొనవయ్యా ! నీవారమూ మము
కన్నుల వెన్నెల నిండా !
శ్రీసత్యనారాయణా ! హేశ్రీఆదినారాయణా !

యాదగిరిని సింహాచలమందున
వెలసినలక్ష్మీనరసింహా!
ప్రహ్లాదుడు పిలువగనె కంట బడి
వరము లొసంగిన దయామయా !

ఎదలో నిలిపి యెంత పిలిచినా
ఎందుకు పలుకవు ? దయ లేదా ?
నరసింహా ! దయ లేదా ?

అనంతభూభారము వహియింపగ
శ్రీకూర్మములో వెలసినదేవా !
చేకొను మివె మానుతులూ నతులూ;
శ్రీనాథా ! భూనాథా ! శ్రీకూర్మనాథా !

జగదేకపావనా ! సూర్యనారాయణా !
ప్రత్యక్షదైవమా ! ఓలోకబంధూ !
భక్తజనహృదయాలు పద్మమ్ము లై విరియ
అరసవిల్లిని నీవు వెలసినావా !
అంజలింతుము దేవ ! మ మ్మేలుకోవా ?
జగదేకపావనా ! సూర్యనారాయణా !
ప్రత్యక్షదైవమా ! ఓలోకబంధూ!
సూర్యనారాయణా ! సూర్యనారాయణా !
సూర్యనారాయణా !

---

శ్రీమతి ఎస్. జానకి, శ్రీ ఎస్. పి. బాలసుబ్రహ్మణ్యం గానం చేసిన "ఆంధ్ర పుణ్యక్షేత్రాలు" గ్రామఫోను రికార్డు.

(మద్రాసు గ్రామఫోన్‌కంపెనీవారిసౌజన్యంతో)



## పువ్వుల్లారా!

పువ్వుల్లారా!
తీగతల్లినవ్వుల్లారా!
అందాలకు అందా లై కను
విందు చేయుపువ్వుల్లారా!

పరమేశునిపాదార్చనలో
చిరునవ్వేపువ్వుల్లారా!
మమత నిండుమగువలసిగలో
వలపు లొలుకుపువ్వుల్లారా!

బురదలోన పుట్టినా
పరిమళాలు చిందేరు!
ముళ్లపొదలపై నున్నా
మృదువుగానె నవ్వేరు!

ఎండలలో చివికినా
ఇంకదు మీచల్లదనం!
వానలలో తడిసినా
వాడదు మీవలపుధనం!

పూచినఒకపూటకే
పుడమి రాలిపోయినా
పరులసేవలోనే మీ
బ్రతుకు సోలిపోయినా

మూగనవ్వు నవ్వేఓపువ్వుల్లారా !
రాగసుధలు చిందేచిరునవ్వుల్లారా !
అహెూ ! త్యాగజీవుల్లారా !
ఒహెూ ! మౌనయోగుల్లారా !

బ్రతు కంటే మీదే ! మీదే !
పరమార్థం అంతా మీదే !
పువ్వుల్లారా !
తీగతల్లినవ్వుల్లారా !
అందాలకు అందా లై కను
విందు చేయుపువ్వుల్లారా !!



# మేఘమాల

నీలాలనింగిలో మేఘాలమాలా!
నీలికడలిని విడిచి నింగి కెగసేవా!

ఆకాశవీధిలో అందాలు చిందేవు!
కన్నయ్యమేనిలో కాంతులను దోచేవు!

ఈమృదంగధ్వాన ఎచట నేర్చావో!
ధిమిధిమింధిమిధిమిధ్వని వెలువరించేవు!

మెఱపుతీవెకు నాట్యవిన్యాసములు నేర్పి
సురలోకరసికులకు సొంపు ఘటియించేవు!

ఆకాశమున చేరి ఆకారమును మార్చి
ఉరుముముతూ దిక్కులకు వడకు పుట్టించేవు!

వెలిగినంతకు ఒక్కవెలుగు వెలిగేవు!
నీరు నీరై కడకు నేల కొరిగేవు!

క్షణములో ఎన్నెన్నొ రూపాలు మార్చేవు!
కామరూపిణి వటే? ఓమేఘమాలా?

కనువిందు చేయవే ఓమేఘమాలా!
ఊగవే ఊగవే పెనుగాలిడోలా!

నీలాలనింగిలో మేఘాలమాలా!
ఊగవే ఊగవే పెనుగాలిడోలా!



## డాక్టర్ వక్కలంక లక్ష్మీపతిరావుగారి రచనలు :



| | | |
|---|---|---|
| 1 | వీరభారతము | (మహాకావ్యము) |
| 2 | పారిజాతసౌరభము | (పద్యకావ్యము) |
| 3 | జలదగీతి | (కాళిదాసకృతికి ఆంధ్రీకృతి) |
| 4 | పారిజాతము | (వచనమహాకావ్యము) |
| 5 | సుమాంజలి | (గేయకావ్యము) |
| 6 | స్వతంత్రభారతి | (భారత ప్రభుత్వబహూకృతి నందినగేయకృతి) |
| 7 | బాలభారతి | (గేయకృతి) |
| 8 | రాధికాప్రణయము | (గేయకావ్యము) |
| 9 | కవితాలోకము | (గేయకృతి) |
| 10 | కవితావసంతము | (గేయకృతి) |
| 11 | కాంతిజలపాతం | (వచన కవితాసంపుటి) |
| 12 | మణిదీపాలు | (గేయకావ్యము) |
| 13 | స్వతంత్రభారతము | (గేయకృతి) |
| 14 | కవితాపుష్పకము | (గేయకృతి) |
| 15 | హరివిల్లు | (గేయకృతి) |
| 16 | మనిషీ! ముందుకు చూడు | (గేయకృతి) |
| 17 | గీతాంజలి | (రవీంద్రునికృతి కాంధ్రీకృతి) |
| 18 | నర్తనశాల | (ధ్వనిప్రధాన రూపకము) |
| 19 | భువనవిజయము | (నాటకము) |
| 20 | వెలుతురుపిట్టలు | (నాటిక) |
| 21 | ఉత్తరకుమారప్రజ్ఞలు | (నాటిక) |
| 22 | వీరబభ్రువాహన | (బుఱ్ఱకథ) |
| 23 | ఆదర్శశిఖరాలు | (సాంఘికనవల) |
| 24 | చిన్నారిలోకం | (నవల) |
| 25 | రాగబంధం | (నవల) |

26 విధివంచితులు [చిన్నకథలు]
27 స్వాతంత్ర్యలక్ష్మి [సంగీతరూపకము]
28 వెన్నెలకన్నెలు [సంగీతరూపకము]
29 పచ్చతోరణం [సంగీతరూపకము]
30 సంక్రాంతిలక్ష్మి [సంగీతరూపకము]
31 వెన్నెలపండుగ [సంగీతరూపకము]
32 ఆలయాలసీమ [సంగీతరూపకము]
33 విజయదశమి [సంగీతరూపకము]
34 దేవయాని [సంగీతరూపకము]
35 వరూధిని [సంగీతరూపకము]
36 మణిమాల [ముక్తకములు]
37 సంక్రాంతిశోభ [సంగీతరూపకము]
38 మకరసంక్రాంతి [సంగీతరూపకము]
39 The Jasmines [ఆంగ్లగేయములు]
40 పారిజాతాపహరణ ప్రబంధసౌందర్యసమీక్ష [పరిశోధనగ్రంథము]
41 ఆంధ్రపుణ్యక్షేత్రాలు [శ్రీమతి జానకి, శ్రీ S.P. బాలసుబ్రహ్మణ్యం పాడినభక్తిగీతాలు]
42 అమృతవర్షిణి [గేయరచన]
43 స్వాతంత్ర్యదీప్తి [దేశభక్తిగేయరచన]
44 పూజాసుమాలు: [ముక్తకపద్యసంపుటి]
45 వెన్నెలవీణలు [గేయరచన]
46 దసరాసంబరాలు [సంగీతరూపకము]
47 కల్యాణవేదిక [చారిత్రకనాటిక]
48 సంయుక్త [చారిత్రకనాటిక]
49 తా నొకటి తలిస్తే [సాంఘికనాటిక]
50 వెలుగునీడలు [పద్యకావ్యం]